Approved by the Director of Libraries for Class and General Libraries 6227 G T XII 805

# భక్త మల్లమ్మ

(శ్రీగిరి మల్లయ్య మహాభక్తురాలు)



రచయిత :

విద్యార్ణవ, సాహిత్యసరస్వతి,

నూతలపాటి పేరరాజు

Phone : 21907

శైవసాహిత్య పరిషత్ శ్రీశైలం

అరండల్ పేట 7వ లైను, గుంటూరు-2

# మున్నుడి

ద్వాదశ జ్యోతిర్లింగములలో నొక్కఁడై జగత్ప్రసిద్ధి గాంచిన శ్రీశైలమల్లికార్జునుని మనసార ధ్యానించి, భక్తిమెయి సేవించి, సంసారసాగర ముత్తరించి, మోక్ష మొందిన మహాభక్తు లెందఱో కలరు. వారి సంగ్రహ చారిత్ర కుసుమముల నేర్చి, మాలగాఁ గూర్చి, మల్లికార్జునుని కర్పింపఁ దలంపుగొని, నే నీ 'భక్తమల్లమ్మ' కథను ప్రథమ కుసుమముగాఁ గైకొంటిని.

భక్తాళి సులభశైలిలో రచింపఁబడిన యీ చిఱు పొత్తమును జదివి, భక్తిపీయూషమును గ్రోలి, తరింతురు గాక !

ఏ దేవునకు శిఖరేశ్వరం బ్రశాంత
లాలిత క్రీడాచల స్థలంబు
తేవ నే వేల్పు క్రీడించు కేళాకూళి
తరళ తరంగ పాతాళగంగ
యే దేవునకుఁ గూర్మి హేళాకళావతి
భ్రమరాంబ భవ్య ప్రభాకరంబు
భైరవాది క్షేత్రపాలక ప్రవరులు
ప్రహరిఁ జరింతు రే భవ్యమూర్తి
నట్టి శ్రీమన్మహాదేవు ననుఁగుపురము
గూఢసంజీవనీవని, కుంజపుంజ
వర్ధితోన్నిద్ర కల్పద్రుమవాసి కూప
ధర్మహర్మ్యోన్నతంబు-శ్రీపర్వతంబు

శ్రీశైలము శ్రీశైలము
శ్రీశైలంబనెడు పుణ్యశీలుని మదిలో
నా శైలజాధి నాథుఁడు
శ్రీశైలనివాసుఁ డుండుఁ జేతః ప్రీతిన్.

శ్రీపర్వతపురాణము.
[శివధార్య ప్రణీతము]

# భక్త మల్లమ్మ

సిరులు కిరవగు నాంధ్రదేశమునకు మండనాయమానమై యొప్పు కర్నూలు మండలమున శ్రీశైలక్షేత్రము వెలయుచున్నది. దాని దాపున 'శివపుర' మను పల్లెగలదు.

ఆ పల్లియ పంటకాపులకు నెలవు. వారిలో సోమిరెడ్డి శైవాచార సంపన్నుడు, దయార్ద్ర హృదయుడు. బీదలకు పెన్నిధి అతిథిఅభ్యాగతుల నాదరించువాడు.

సోమిరెడ్డిది మొదటినుండియు సింతకలిగిన కుటుంబము, తండ్రి తాతలు దొడ్డభూస్వాములు, దాతృత్వము వారికి వెన్నతో బెట్టినది సోమిరెడ్డియు వారి యడుగు జాడల నడుచుచు వితరణశాలియని పేరొందెను. అతని యీవికిదగినట్లు పాడిపంటలు సమృద్ధములుగా నుండెను.

అతడు అనుదినము ప్రొద్దుపొడువకమున్నె మేల్కాంచి స్నానాదికములు తీర్చి, విబూదిరేకలు దిద్ది, శివపూజచేసి, నీల్కావిదోవతిగట్టి, రుద్రాక్షమాల చేబూని, జంగముల నరయ వీధిని నరగుచుండ నా శివభక్తుని జూడ రెండు

కన్నులుచాలవు. అట్లాతడు ఆగంతువులకొఱకు మధ్యాహ్నము దనుక వెదకి వెదకి, కనబడిన యతిథులను బ్రియమార నింటికి దోడితెచ్చి, మృష్టాన్నమిడి సంతృప్తుల గావించుచుండెను. తోడ నొక రిద్దరైనను అతిథులులేక యాత డేనాడును ముద్ద యెత్తినవాడు కాడు.

గిరిజాంబ ఆతని ధర్మపత్ని. ఆమె పతికి తగిన యిల్లాలు, సుగుణాలవాల. అన్నపూర్ణకు నుద్ది అతిథులెందఱే వేళ వచ్చినను వండ నలయదు. దానధర్మములందు భర్తకు దోడ్పడుచు 'సహధర్మిణి' యను పదము సార్థక పఱచుచుండెను.

ఆ పుణ్యదంపతుల కన్ని సంపదలుండియు సంతాన సంపద లేమిచే వగలబొగులుచుండిరి. సంతతి లేనివారికి గతులు లేవను పెద్దలనుడి వారిని మిక్కిలి బాధించుచుండెను.

గిరిజాంబ సంతానముకొఱకు నోయని నోము లేదు. చేయని వ్రతము లేదు. మునుకని తీర్థము లేదు. మెట్టని క్షేత్రము లేదు. కాని, ఏ దేవునకును దయరాలేదు.

ఒకనాడు [illegible] యేదియో యూహించుచు

గూరుచుండియుండ, తలవని తలంపుగా నచ్చటికి వచ్చిన భార్యను జూచి ఆత డిట్లనెను.

"గిరిజా ! మన మెంతటి మూఢులము! చేతిలో వెన్న పెట్టుకొని నేతికై దేవులాడుచున్నాము. ఇంత కంటెను అవివేకులుందురా? మనకు దాపుననే సిరిగిరి మల్లయ్య కలడు. అతడు భక్తసులభుడు. వారికోర్కెల దీర్ప బద్ధకంకణుడు. అతనిని భక్తితో సేవించి సఫలత నొందని యతడు నభూతో న భవిష్యతి. మన మింతవరకు మల్లయ్యమాటయేమఱచి, అన్యదేవతలను కొలిచివ్యర్థుల మైతిమి. ఇకనైనను మనమా దేవుని కడకేగి, భక్తితో మ్రొక్కి, మా యపరాధమును మన్నింపుడని చెంపలు వేసికొనిన అతడు తప్పక మన్నించి, మనకోర్కె నెఱ వేర్చును. గిరిజాంబ – నిజమా !

"పిచ్చిదానా ! మల్లయ్య సామాన్యుడు కాడు. ఆద్యుడు - త్రయీవేద్యుడునగు సాక్షాచ్ఛంకరుడు. శంక రుడే భక్తుల మనోభీష్టములదీర్ప కైలాసమువీడి వచ్చి, స్వయంభూ జ్యోతిర్లింగమూర్తిగ శ్రీశైలమున వెలసి యున్నాడు. ఆ మహాదేవుని మాహాత్మ్యం మింతయని వర్ణింపరానిది. అటకేగి, ఆ మల్లికార్జునుని భక్తితో

సేవించిన మనకోర్కె తీఱును. మన మిక నాలసింపక అటకు పోవలయును. ఇదే మన ప్రయాణము."

ఆ మాటలకు గిరిజాంబ సంతసించి పయనమునకు సర్వము సిద్ధపఱచెను.

౨

ఆ దంపతులు మఱునాటి వఱువాత మేల్కాంచి, కాలకృత్యములు దీర్చుకొని, శ్రీశైలము దారి పట్టిరి.

అవ్వేళ, బాలభానుని అరుణకిరణావళి వృక్షాగ్రముల ప్రసరించి బంగరుపూత పూసినట్లుండెను. త్రోవయంతయు కాకులుదూఱని కాఱడవి యగుటచే అందందు వన్యమృగముల భీకరారావములు వినబడుచుండెను. వారా యఱవులకు భీతిల్లక భయంకరాటవిని నడచి నడచి మధ్యాహ్నమునకు భీమునికొలను చేరిరి. అచ్చటి ప్రకృతిశోభ వారి మార్గాయాసము నించుక అవనయించెను.

అంత వారా కొలనునందు స్నానమాచరించి, వంటచేసికొని, స్వామికి నివేదన మొనర్చి, అట వచ్చిన అభ్యాగతునకు వడ్డించి, తా మింత తిని, కొంతవడి విశ్రమించిరి. ప్రొద్దు ప్రాలినపిమ్మట, మరల వారు పయనము

సారించి, సాయంకాలమునకుహాటకేశ్వరము జేరి, ఆరాత్రి నందు నిలిచిరి.

వారు ప్రాతఃకాలముననే లేచి. అడనుండిపాతాళ గంగకేగి, తానమాడి, నీరములుగొనివచ్చి, శ్రీమల్లి కార్జునునకు సమంత్రకముగ భక్తితో నభిషేక మొనరించి శ్రీ భ్రమరాంబా దేవిని కొలిచిరి.

ఇట్లువారు శ్రీభ్రమరాంబా మల్లికార్జునులను కొన్నిదినములు సేవింపగా, ఒకనాటిరాత్రి శ్రీ మల్లి కార్జునుడు సోమిరెడ్డికి స్వప్నమున సాక్షాత్కరించి,భక్తా! మీ దంపతుల అచంచల భక్తికి, సేవకు సంతసించితిని. మీకు నా వరప్రసాదమున శివభక్తురాలగు తనయ కలు గును. పొమ్ము' అని చెప్పి అదృశ్యుడయ్యెను.

తోడనే సోమిరెడ్డి మేల్కాంచి, అర్ధాంగిని లేపి, తా గన్న కలను దెలిపెను. గిరిజాంబ తమకోర్కె ఫలో న్ముఖ మగుటకు సంతసించెను.

తెల్లవారగనే ఆదంపతులు భక్తితో మల్లయ్యకు అభిషేకాదులొనర్చి, శ్రీ భ్రమరాంబకు కుంకుమార్చన చేసి, పంచభక్ష్య పరమాన్నములతో జంగములకు విందు గావించి, శివపురమునకు పయనమైపోయిరి.

యిల్లుచేరిన కొలది దినములకే, గిరిజాంబకు గర్భ చిహ్నములు పొడగట్ట సాగెను. ఇక, ఆదంపతుల సంతోషమునకు మేర లేదు శ్రీ మల్లికార్జునునకు చేయెత్తి మ్రొక్కిరి. శ్రీ భ్రమరాంబను మనసార ధ్యానించిరి,

క్రమక్రమముగా గిరిజాంబకు నవమాసములు నిండెను. ఆమె యొక శుభ ముహూర్తమున చక్కని ఆడు బిడ్డను గనెను.

ఆవార్త తెలిసిన సోమిరెడ్డి మిక్కిలి సంతసించెను. జంగములకును, భూసురులకును భూరిదానము లొసగెను. పేదసాదలకు కడుపార అన్నము పెట్టించెను. వారెల్లరు ఆ కమెగందును దీవించి చనిరి.

అంత నా గృహమేధి జోస్యులను రావించి, కుండలి వేయించి, ఆబిడ్డ భావిని తెలిసికొని ముదమొందెను. పురుడు తీరగనే ఆ దంపతులు శ్రీశైల మల్లికార్జునుని వరప్రసాదిని యగుట ఆ బాలకు 'మల్లమ్మ' యను పేరిడి అల్లారుముద్దుగా పెంచుచుండిరి.

మల్లమ్మ శుక్లపక్ష చంద్రునివలె దినాదినాభివృద్ధి నొందుచు ఆటపాటలతో తల్లిదండ్రులను సంతోషపెట్టు

చుండెను. ఏడులు పై బడుకొలది-ఆ బిడ్డకుశివభక్తి ఎక్కువగు చుండెను.

మల్లమ్మ అనుదినము ప్రొద్దుపొడవక మున్నె లేచి తల్లి దండ్రులకు మ్రొక్కి, బాలకృత్యములుతీర్చుకొని, శివ పూజయందు మగ్నయగుచుండెను. ఆమె మనోనిశ్చల తను - ధ్యాననిష్ఠను - పూజావిధానమును జూచి ఆశ్చ ర్యపడని వారుండరు. మిన్నువిఱిగి మీదపడినను ఆమెకు శివపూజ తప్పదు. అదిలేనిది ఉద్ధరణెడు నీరు సహితము నోట బోసికొనదు.

పాపము ! ఆమెదురదృష్ట మేమోకాని. అచ్చట్లు ముచ్చట్లు తీరకమున్నె గిరిజాంబ కాలగతి నొందెను. సోమిరెడ్డి భార్యావియోగమునకు చింతించియు వెతను పైకితోపనీయక మల్లమ్మను కంటెని ఱెప్పవలె గాపాడు చుండెను. మల్లయు మాతృమరణమునకు మిక్కిలి దుఃఖింపక, శివపూజను ఏమఱక చేయుచుండెను.

క్రమక్రమముగా మల్లమ్మ ఆరూఢ యౌవన మయ్యెను. సోమిరెడ్డి తనతనయకు తగిన వరునిజూచి పెండ్లిగావింప తహతహపడుచుండెను.

ర

శివపురమునకు దాపున సిద్దాపుర' మను గ్రామము కలదు. అందు హేమారెడ్డి సంపన్న గృహస్థుడు. భూస్వామి, ఊరిపెద్ద చుట్టుప్రక్కల పలుకుబడి గలవాడు.

అతని యిల్లాలు పద్మమ్మ – గయ్యాళి. మగని మాటకు ఎదురాడునది.

హేమారెడ్డికి ఇద్దరు కొడుకు. పెద్దవాడు వేమా రెడ్డి; చిన్నవాడు బరమారెడ్డి.

జ్యేష్ఠపుత్రుడు దుర్గుణముల పుట్ట. అయినను హేమారెడ్డి అయినవారింటి పిల్లను దెచ్చి, వేమారెడ్డికి వివాహముచేసి, తనకర్తవ్యము నెరవేర్చుకొనెను.

వేమారెడ్డి భార్యను కన్నెత్తియైన చూడక ఎల్ల ప్పుడు సానుల యిండ్లలోబడి యుండువాడు. అతడు పెద వికి మించిన పల్లగుటవలన చక్కదిద్ద తండ్రికి సాధ్యపడ లేదు.

కోడలు నాగమ్మయు మగనికి తీసిపోవునదికాదు వ్యభిచారిణి కాకపోయినను చప్పనాతి. ఇతరులనుచూచి ఓర్వలేనిది. ఏనాడును వాకిటికి వచ్చిన బిచ్చగానికి

చేయెత్తి పిడికెడు గింజలు వేసినది కాదు. అత్త కుతగిన కోడలని ఎల్ల వారనుకొనుచుందురు.

ఇక ద్వితీయుడు- బరమారెడ్డి వట్టి వెర్రిబాగుల వాడు జ్ఞానసూన్యుడు. దల్లి చేతిలోవి కీలుబొమ్మ.

ఇది – హేమారెడ్డి ఇంటి స్థితి.

సోమిరెడ్డి. హేమారెడ్డి స్థితిగతులు చక్కగా ఎఱిగినవాడగుటచేత. అతనికొడుకు బరమారెడ్డి మందమతి యని వినియు తన కూతురు - మల్లమ్మను అతనికీయ నిశ్చయించి' ఆవార్త చెప్పి పంపెను.

హేమారెడ్డి, సోమిరెడ్డి వియ్యమునకు సంతసించి, తనసమ్మతిని తెలియజేసెను. తోడనే సోమిరెడ్డి ముహూర్తికుల రావించి, లగ్నపత్రిక వ్రాయించి, భూసురుని కిచ్చి పంపెను.

హేమారెడ్డి ఆశుభలేఖ నందుకొని, ముద మొంది ఆబ్రాహ్మణుని ఘనముగా సత్కరించి పంపి అతడు తన వారితో శివపురమునకు పయనమై పోయెను.

సోమిరెడ్డి యింత ఉన్నవాడగుట వివాహ మతి వైభవముగా జరిపెను.

చూడవచ్చిన అమ్మలక్కలు వధూవరులనుగాంచి, "ఇదేమి! కాకిముక్కుకు దొండపండు కట్టినట్లున్నది.

బంగారు మమ్మను పిల్లమ్మను అవివేకికిచ్చి పెండ్లి చేయు కన్నతండ్రికి మనసెట్లు వచ్చెనో!" అని గుసగుసలు పోవ జొచ్చిరి. వారిలో కొందరు మల్లమ్మ ప్రారబ్ధ మిట్లుండ ఎవరేమి చేయగలరో?" రని సరిపుచ్చుకొనిరి. మల్లమ్మ మాత్రమించుకయు వ్యవగించుకొనక. తనపాలికి వచ్చి నది పరమాన్నమని యెంచి సంతృప్తిపడెను.

అంత, పెండ్లివారు సిద్ధాపురమునకు తరలిపోయిరి.

౫

ఆనాడు సప్తమి-గురువారము, జాము ప్రొద్దెక్కి యుండవచ్చెను. హేమారెడ్డి బండికట్టుకొని వియ్యంకుని యింటికివచ్చెను.

మల్లమ్మలోడనే పాద్యమిచ్చి, ఉచితాసనము వేసి, కూర్చుండబెట్టి, మామగారిని కుశలప్రశ్న లడుగు చుండెను.

అంతలో పొలమునకుపోయి యుండిన సోమిరెడ్డి వచ్చి, వియ్యంకునిగాంచి. ఇదేమిబావా! ఉత్తరము వ్రాయకయే వచ్చితివి? ఎల్లరు క్షేమమా!" అనిఅడిగను

ఆ మాటలకు హేమారెడ్డి "అందరు కుశలము వ్యవధిలేక జాబువ్రాయలేదు. ముందు మంచిరోజులు

లేవట! మల్లమ్మను పిలిచికొని పోవచ్చితిని మధ్యాహ్నము అష్టమి గడియలు రాకముందే ప్రయాణము" అనెను. ఆమాటలువిని సోమిరెడ్డి "ఇప్పుడువచ్చి అప్పుడే ప్రయాణమా? ఏమంత తొందర?" అని ప్రశ్నించెను. అందులకు "బావా! నీకు తెలియని దేమున్నది? క్షణము తీరిక లేదు. కోతలు కాచుకొనియున్నవి. ఈ దినము పోయిమే తీరవలెను. ప్రయాణమునకు సర్వము సిద్ధము చేయింపు" మనెను.

ఆలోపల మల్లమ్మ వంటచేసి, శివునకు నివేదించి తండ్రి మామలకు వడ్డించి, తానింత తినెను.

అంతలో మల్లమ్మ అత్తవారింటికి పోవుచున్నదని విని, పొరుగింటి అమ్మలక్కలామెను సాగనంపవచ్చిరి.

కన్నకడుపు - పెంచినప్రేమ - తల్లిలేని పిల్ల - ఈ మూడును ముప్పిరిగొని సోమిరెడ్డిని కలతపెట్ట, మల్లమ్మ ఎడబాటునకు ఓర్వలేక సోమిరెడ్డికి దుఃఖము పొరలివచ్చెను. అప్పుడాతడు కన్నీరు గార్చుచు హేమారెడ్డితో 'బావా! మా మల్లమ్మను గూర్చి మీకు ప్రత్యేకముగా చెప్పవలసిన దేమియు లేదు. తల్లిలేనిపిల్ల ఆ కొరత తోపనీయక కష్టములకోర్చి. పెంచి ఇంత

దానిని చేసి మీ చేతిలో పెట్టితిని. ఇప్పుడీమె మీసొత్తు ఇక నీమెకు మీరే దిక్కు. పెండ్లియైన పిదప, ఎట్టిసాధ్వు లును పుట్టినింట పెద్ద కాలము ఉండతగదని పెద్దలందురు తోడ్కొని పొందు" అనెను.

"బావా! నీవేదిదులును పెట్టుకొనవద్దు. మల్లమ్మ కే కొరతయు నుండ"దని సోమిరెడ్డిని ఓదార్చెను.

అంత మల్లమ్మ చూడవచ్చిన ముత్తైదువులకును తండ్రి మామలకును నమస్కరించి, వారి యాశీస్సులు పొంది, మామవెంట పయనమై పోయెను.

౬

అదేమి చిత్రమో! మల్లమ్మ అత్తవారిల్లు మెట్టి నది మొదలు ఆ యిల్లు పాలు పొంగువలె నుబికివచ్చెను. పాడిపంటలు సమృద్ధములయ్యెను.

"హేమారెడ్డి ఎంతటి అదృష్టవంతుడు! చిన్న కోడలు – మల్లమ్మ గడప ద్రొక్కగనే అతనికి ఏమి పంటలు! ఏమిపాడి! ఆతల్లి శ్రీ మహాలక్ష్మి, అతనియింట ఇప్పుడేమూాల చూచినను ధాన్యపు రాసులే!

"ఆహా! ఏమి ఆమె దైవభక్తి! పతిసేవ! అత్త మామల పూజ! అతిథి ఆదరణ! బంధు ప్రేమ!"

అని ఊరివారెల్లరు మల్లమ్మను వేనోళ్ళపొగడ దొచ్చిరి.

ఆ పొగడ్తలు విన లేక, నాగమ్మ చెవులు చిల్లులు పడసాగినవి. ఆమె కా స్తుతి వాక్యములు కర్ణకఠోరము లుగా నుండెను.

ఒకనాడు నాగమ్మ ఒంటరిగ కూర్చుండి యిట్లు తలపోసెను.

"ఏమి ఆగడము! ఏయింటచూచినను మల్లమ్మ స్తుతియే! ఏనోటవిన్నను మల్లమ్మ స్తుతియే! ఏమి దీని యదృష్టము! ఈమల్లికథచూడగా 'ముందుపుట్టిన చెవుల కన్న – వెనుక వచ్చిన కొమ్ములు పెద్ద' అన్నట్లున్నది. నేను ఈ యింటికి అయినదానను; పెద్దకోడలను నాకు మర్యాద లేదు. నన్ను గూర్చి ఒక్కరును మంచిని తల పోయరు. ఏమి దీని శివపూజలు! అతిథిసేవలు? వాకిటికి వచ్చిన బిచ్చగాండ్రకు చేటలతో దోచి పెట్టుట? దీని సొమ్మేమిపోయినది? తండ్రి సంపాదించినది గాదుగదా!

"నా మనస్సునకు శాంతి లేదు. ఎట్లుండును? మగడా సానియిండ్ల చుట్లు తిరుగువాడు. మఱది తిక్క శంకరయ్య. అత్త రాక్షసి, మామ ధర్మరాజు మల్లి శివ

భర్తురాలు. దీనిపోరు విన్న అటకాలుమంట నెత్తికెక్కుచున్నది. మా అత్త కీమల్లిపై లేనిపోనివి నూరిపోసినగాని దీని పొగరణగదు. అప్పుడు నాకు అన్నము రుచించును. కంటికి నిద్దురపట్టును.”

అని తలపోయుటయె తడవుగా నాగమ్మమల్లమ్మపై కొండెములా చెప్పి, అత్తమనస్సు విఱిచివైచినది.

ఆ క్షణమునుండియు అత్త - పద్మమ్మ మల్లమ్మను చక్కగా పలుకరింపదు మనసిచ్చి మాటాడదు. ఎల్ల వేళల కొఱకొఱలాడుచుండును. ఆమెను కష్టంపు పనులు చేయ నియమించును.

మల్లమ్మ అత్తమాటలకు బదులాడక, ఆమెఆజ్ఞను సుగ్రీవాజ్ఞగా భావించి, ఎట్టి కష్టంపు బనినైనను సంతోషమున జేయుచు, భర్తృసేవ ఏమఱక సలుపుచు, శివ ధ్యానైక నిష్ఠతో కాలము పుచ్చుచుండెను.

౨

‘ఈ చరాచర ప్రపంచమంతయు క్రీడార్థము నాచే సృష్టింపబడినది. మూఢులు అరిషడ్వర్గమునకు లోనై, మోహపాశబద్ధులై, దుర్గతి నందుదురు. బుద్ధిమంతులు నిజమెఱిగి. భక్తిజ్ఞాన వైరాగ్యములచే సంసారసాగర

మును తరించి నన్ను జేరుదును. త్రిమూర్తులు పరబ్రహ్మ స్వరూపులై నను భక్తుల భావములననుసరించి వారి యిష్ట దైవతరూపము గోచరించుచుందురు. మల్లమ్మ నన్ను తన యిలువేల్పు గావించి భక్తితో పూజించుచున్నది. స్థిత ప్రజ్ఞుడు దుఃఖములు వచ్చినతటి శోకింపడు. సుఖములు కలిగినపుడు సమ్మోహమును పొందడు. స్వజన పరజనుల పట్ల అనురాగ క్రోధములను, భయమును కలిగియుండక సమత్వము కలిగియుండును. మఱియు మునివలె ఉదాసీనుడై యుండును. లక్షణములన్నియు మల్లమ్మయందు గూడుకట్టుకొనియున్నవి. ఇట్టి భక్తురాలిని రక్షించుట నా పరమధర్మము కాని, కరగనిది పసిడి కాంతిరాదు కదా! మల్లమ్మకు ఇటనుండి సంసార క్లేశములు కలిగించి, ఆమె అచంచలభక్తిని పరీక్షించెద. ఆమె ఆ రాపిడికి తాళినా, ఉత్తమపదవి ప్రాప్తించును.'

అని శ్రీశైల మల్లికార్జునుడు నిశ్చయించి, మల్లమ్మను పరీక్షించుకొనుటకు తోడనే, జంగమ వేషముదాల్చి హేమారెడ్డి యింటి వాకిటనిలిచి 'భవతి! భిక్షాందేహి' అనెను.

ఆమాట విన్న నాగమ్మ దండతాడిత భుజంగము

వోలె రోజుచువచ్చి వాకిట నిలిచియున్న జంగమయ్యను గాంచి—

"ఓయీ! నీకప్పుడే తెల్లవారెనా జోలెకట్టుకొని సిద్ధమైతివి. ఇచ్చట నీకు బిచ్చము పెట్టువారెవ్వరును లేరు వచ్చిన దారిన పొమ్ము" అని గద్దించెను.

అంతనా భిక్షుకుడు. "తల్లీ! ఎవరును లేరనెద వేల? గౌరీదేవివలె నీ వున్నావు కదమ్మా! పిడికెడు భిక్షము పెట్టి పొమ్మనకూడదా? కలిగినవారు మీరె యిట్లున్నచో, ఇక బిచ్చము పెట్టు వారెవ్వరు? అమ్మా! పూర్వజన్మలో చేసిన పుణ్యావశమున కలిగినవారింటి కోడలివైతివి. ఈజన్మలో చేసిన పున్నమునకు మలుపుట్టువున అనంతసుఖ మనుభవింతువు" అనునంతలో—

నాగమ్మ "ఆ పొట్టచేతపట్టుకొని వచ్చిన ఈబిచ్చగాడు తొలిజన్మలో నేనుచేసిన పుణ్యాపాపములు చూచినాడట! కడుపున కింత పుట్టించుకొనుటకే ఈ మెట్ట వేదాంతము. చాలుచాలు నీమాటలు ఇటనుండి వెంటనే పొమ్ము. పోనిచో నీ వీపు బ్రద్దలగు" నని కటువుగాబలికెను.

అంతలో ఇంటిలోనున్న మల్లమ్మ వెలుపలికివచ్చి, నాగమ్మను గాంచి—

"అక్కా! బిచ్చగాండ్రతో మనకు వాగ్వాదమేల! ఇంత కలిగిన యిల్లని వత్తురు. ఉండియు లేదనరాదు. ఆమాటకు దేవుడును మెచ్చడు పిడికెడు పెట్టిన, వారె పోవుదురు"

అని చెప్పి, ఇంటిలోనికి పోయి, బిచ్చము తెచ్చి పెట్టెను.

అంత నా జంగముడు మల్లమ్మనుగాంచి: తల్లీ! నీవు అన్నపూర్ణాదేవివి; ఈ యింటి భాగ్యదేవతవు. నీవున్నచోటు ఎల్లవేళల సిరిసంపదలతో తులతూగు చుండు" అని దీవించి చనెను.

అంతలో అత్త కోపారుణితనేత్రయై అచ్చటికివచ్చి మల్లమ్మను చుఱచుఱజూచుచు "ఏమేమల్లీ! ఈరాద్ధాంతమేమి?" మని గద్దించెను.

తోడనే నాగమ్మ "అత్తా! ఆపొగరుబోతు బిచ్చగాడు ఏమనిపోయెనో వింటివా? ఈమల్లి యీ యింటి భాగ్య దేవతయట! నేను కానట! ఇక ఈ యింటిలో నేనుండలేను" అని ఆ నంగనాచి వలవల యేడ్చెను.

అంత పద్మమ్మ నాగమ్మను ఓదార్చి, మల్లమ్మను చెంపలు వాయించి."ఏమే మల్లీ! నా పెద్దకోడలు లేదన్న

ప్పుడు నీ వెట్లు బిచ్చము పెట్టితివి? నాయింట నీకేమి యధికారమున్నది? 'దిక్కులేని దేవునిగుడి సొత్తయితే, తిరిపెమెత్తుకొని తినే తిమ్మన్నకూడ పెత్తనదారై రెండుచేతులతో దానము చేయవచ్చు. నీకుతగిన శాస్త్రి చేయుదురు. ఇదిగో! విను. ఇటనుండి నీవు వంటచేయవద్దు. దినమునకు నూఱు కడవల నీళ్ళు చేదవలెను. ఏబదిమానికలజొన్నలు విసరవలెను. మేము వేసినప్పుడింత గతుకవలెను" అని ఆజ్ఞాపించెను.

అందులకు మల్లమ్మ యించుకయు బదులాడక, సంతోషముతో సమ్మతించెను.

౮

పాపము! నీళ్ళు చేదిచేది, జొన్నలు విసరివిసరి మల్లమ్మకు చేతులు బొబ్బలెత్తినవి. మల్లికార్జునుని నమ్మి, అతని పూజను విడువక చేయుచు, అత్త ఆనతిని తలదాల్చి పనులు చేయుచుండెను.

ఒకనాటి రేయి పగలంతయు ఇంటిపనులు చేసిచేసి మల్లమ్మ అలసియు, చేతిబొబ్బలు బాధించుచున్నను, విసరుటకు జొన్నలరాశికడ కూర్చుండెను.

ఆమె నడురేయి వఱకును విసరివిసరి, ఎంతకును

రాశి తఱుగకుండుటకు గాంచి, సొలసి, మల్లికార్జునుని ధ్యానించుచు కన్నుమూసెను.

అప్పుడు భక్తరక్షకుడగు మల్లికార్జునుడు అచ్చోట సాక్షాత్కరించి, భక్తురాలగు మల్లమ్మ విసరవలసిన ధాన్యరాసిని గాంచి, 'పాపము! తెల్లవారులోపలమల్లమ్మ ఇంత ధాన్యరాశిని ఎట్లు విసరగలదు? అలసి సొలసి,నిద్రించుచున్నది. ఆమె మేల్కొనులోపల నేనీ రాశిని పిండి చేయవలయు'నని మనమున నిశ్చయించి, తిరుగలిపై ప్రత్రిశూలమును జూప నది గిరగిర తిరుగుచు క్షణమాత్రమున నా రాశినంతయు పిండిచేసెను. అంత నాతడదృశ్యుడయ్యెను.

అంతలో మల్లమ్మ మేల్కాంచి, తన యెట్టయెదు నున్న పిండికుప్పను గాంచి, ఇదేమివింత! అంత జొన్నల రాశిని పిండిచేసిన దెవరు? మల్లయ్యయే చేసియుండును. అని నిశ్చయించి 'స్వామీ! నీకెంతకష్టము? కలిగించితిని నీ చేతులెంత నొచ్చినో కదా! పాపాత్మురాలను క్షమింపుము తండ్రీ!' అని వగచెను.

ఆలోన నాగమ్మ పిండికై వచ్చి చూడ నచ్చట రవంతయును లేకుండెను.

అది చూచి యామె మల్లమ్మను తిట్టిపోసి అత్త కడకు పరుగిడిపోయి "చూచితివా అత్తా మల్లి యెంతపని జేసినదో? విసరిన పిండియంతయు ఏదాసయ్యకో దానము చేసి వంగనాచివలె మిడుకుచున్నది. ఇక మన యిల్లు ముందుకు వచ్చినట్లే! ఒడలువంచి మన మెంతచేసినను లాభ మేమి? మనపాలిటికి మల్లి మారెమ్మగా దాపరించినది. ఇది యిక మనయింట నుండతగదు." అని నిక్కచ్చిగా బలికెను.

తోడనే పద్మమ్మ రుసరుసలాడుచు మల్లమ్మ కడకు వచ్చి అచ్చట పిండిగానక "ఏమిమల్లీ! నీవు విసరిన పిండి యేమైనది? ఏ జంగమయ్యకు పెట్టితివి? నీ శివపూజలు– నీ నిష్ఠలు – నీదానాలు చూడలేకున్నాము." అనుచు పొరకతో నాలుగు వడ్డించెను.

అప్పుడు మల్లమ్మ అత్తా! పిండియేమాయెనో దైవసాక్షిగ నాకు తెలియదు. నే నెవరికిని పెట్టలేదు. ఏ బిచ్చగాడును రాలేదు. ఇది యంతయు మల్లయ్య మాయగా తోచుచున్నది' అని వినయమున బలికెను.

'పాపము! ఇది నంగనాచి పంగముల్లట! మల్లయ్య మాయయట! దీని కేమియు తెలియదట? దీనియాట నిక్లే

సాగనిచ్చిన మా చేతికి చిప్పవచ్చును.' అని మనమున దలబోసి మల్లమ్మనుగాంచి-

"ఓసీ! నీ వొక్క క్షణమైనను ఇక మా యింట నుండతగవు. అడవులకు బోయి ఆవులను మేపుచుండుము మేము దయతలచి పంపిన అంబలి త్రాగి యచ్చటనే యుండు" మని బుగ్గలు కెంపువార మెలిబెట్టిచెప్పెను.

అందులకు మల్లమ్మ యించుకయు వగవక అత్త యానతిని పాటించి వెంటనే ఆవులను తోలుకొని యడవి కేగెను.

ఆహా! మాయత్త యెంతట కరుణామయి! నన్నడవుల కంపి యెంతటి పున్నెము గట్టుకొనెను! ఇంటనుండిన పనుల తొందరలో నా యిలవేల్పగు మల్లికార్జునుని సేవ అబ్బకపోవచ్చును. ఇచ్చట నిరంతరము మనసార సేవించి ధ్యానించు భాగ్యమబ్బినది. పరమపావనమైన గో సేవయు లభించినది. కాని, పతిసేవకు మాత్రము నోచుకొననైతిని. అయినను నా పతి దైవము నా హృత్పీఠమున నెల్లప్పుడు అది వసించియే యున్నాడు. నాకీ భాగ్యమంతయు అత్తవలననే కలిగినది. ఇందులకు కార

కుడు నా మల్లికార్జునుడే ! ఏమి యా దేవుని కరుణార్ద్రి హృదయము! భక్తవత్సలత!' అని మల్లమ్మ యొకనాడు మనమున తలపోయుచు అత్త పంపిన అంబలిని ఈశ్వరున కు నివేదించి తా ద్రావ నాయత్తపడు చుండెను.

అంతలో జంగమయ్యయొకడు గంటవాయించుచు నచ్చటికి వచ్చి మల్లమ్మనుగాంచి, తల్లీ ! రెండు దినములనుండియు నాహారము లేదు. కడుపు మండుచున్నది ఆకలి కిక నేను తాళజాలను. ఎట్టులో కాళ్ళీడ్చుకొని ఈ యడవిని పోవుచుండ నా యదృష్ట వశమున అన్నపూర్ణ వలె నీవు గనపడితివి. పట్టెడన్నము పెట్టి, నా యాకలి దీర్చి, బ్రతికింపుమమ్మా' అని దీనముగ ప్రార్థించెను.

ఆ మాటలకు మల్లమ్మ. 'తండ్రీ ! నీ స్థితిని జూడజాలకున్నాను. అన్నదానమునకు మించిన దానము వేరొండులేదని పెద్దలందురు. నే నొక నిర్భాగ్యురాలను, అత్తయానతిని అడవుల నున్నాను. ఆమె పంపిన అంబలియే నా కాహారము. నీకు కడుపార అన్నము పెట్టి, ఆకలి దీర్చు భాగ్యమునకు నేను నోచుకొనలేదు. నీ కీయంబలి పోయుటకు చేతులు వెనుకాడుచున్నవి. నా యిష్టదైవమగు మల్లికార్జునను నా యందు దయరాకున్నది. నే నేమి చేయుదును. అని విచారపడెను

అప్పుడు మాయా వేషధారియగు మల్లయ్య; తల్లీ విచారపడనేల? నీకు భగవంతుడిచ్చినదే పోయుము. అదియె నాకు అమృతము' అని మల్లమ్మను ఓదార్చెను.

అంత మల్లమ్మ సంశయము వీడి, ఆకుదొప్పనుసిద్ధపఱచి, అందా యంజలి పోసి, మల్లికార్జునుని ధ్యానించి ఆ జంగమయ్య కొసగెను. అతడాదొప్పను ప్రీతితోనందుకొని, అంబలిని గుటగుటత్రాగి త్రేన్చుచు 'అంబలి యెంతబాగున్నదమ్మా! అమృతమే! సమయమునకింతపోసి పోనున్న ప్రాణములను నిలిపితివి. పదికాలాలపాటు సుఖముగా వర్ధిల్లు తల్లీ! కష్టములిట్టు కట్టుకొని ఎల్లకాలము కాపురముండవు. నీకు మంచిరోజులు రాకపోవు. మల్లికార్జునుడే నిన్ను కాపాడును. నేనిక పోయివత్తు' నని చెప్పి; కొన్ని యడుగులు చని అదృశ్యుడయ్యెను.

అదిచూచి, మల్లమ్మ 'ఇదేమి వింత! అంతలోననే జంగమయ్య అదృశ్యుడయ్యెరు. అతడు సామాన్య జంగముడు కాడు. మల్లికార్జునుడై యుండునోపును'అని మనమున నిశ్చయించి 'దేవా! నీకంటె నాకు వేరు దైవములేదు. నమ్మి, సేవించెడి భక్తురాలికి నిజరూపమున ప్రత్యక్షము కాక, ప్రచ్ఛన్న వేషమేల? ఆజ్ఞత

వలన నే నేమి తప్పు చేసితినో? మన్నించి కావుము తండ్రీ' అని మనమున వేడుకొనెను.

"అత్తా ! మల్లమ్మ కిదేమి పోగాలము ! మన యింటి కీర్తి, ప్రతిష్టలు మంటగలసినవి. యిక మన మగ వారు తలలెత్తుకొని నలుగురిలో నెట్లు తిరుగగలరు ? మల్లమ్మకంటెను బజారు బసివి మేలట ! ఎవడో జంగ మయ్య ప్రతిదినము దాని గుడిసెకు వచ్చి, సరసాలాడు చుండుట ! ఆలుమగలకన్న మిన్నగ నుందురట ! ఏదో పనిగలిగి మన మంత్రాల మల్లయ్య అడవికేగి, మల్లమ్మ చేష్టలుచూచివచ్చి, నాతో చూచాయగా ననెను. అది విన్నది మొదలు నా మనసు మనలో లేదు' అని నాగమ్మ చెప్పెను.

ఆ మాటలువిని పద్మమ్మ మండిపడి, "నాగూ ! మన మొకటి తలప దైవ మొకటి తలచెను. మల్లిని అడవు లకు బంపిన మన యిల్లు గుల్లగుట మాని, ఊరట కలుగు ననియెంచి, ఆవులగాయ బంపితిని. యది యచ్చట దం డించువారు లేక, శివపూజలు చేయుచు మిండగాడ్రను మరగినది. పెద్దలార్జించిన మన యింటి యశము ఆ రంకు లాడతో నేలపాలైనది. ఇక దానిని ప్రాణములతో నుండనీయరాదు. బరమన్న వట్టి తెలివి తక్కువ వాడు.

భార్యశీల మెట్టిదో తెలిసికొనలేని దేబె. వాని కేదేని కడుపార బెట్టిన' భార్య చెడునడతను గూర్చి నచ్చజెప్పి పదునైన కత్తినిచ్చి, ప్రాణములు దీయ మల్లమ్మ కడకు బంపెదను. నా బంగారు బరమన్న నామాట జవదాటడు తోడనేపోయి అంతబనిచేసివచ్చు'నన చెప్పగా నాగమ్మ సంతసించెను.

అంతలో బరమన్న యటకు వచ్చెను.

పద్మమ్మ కొడుకును జూచి చేరబిలిచి, కూర్చుండ బెట్టుకొని మేనిపై చేయివైచి నిమురుచు, "నాయనా! ఎంత తెలివితక్కువ వాడవురా? లోకముపోకడ యెరుగకున్నావు. నల్లనివెల్ల నీళ్ళని, తెల్లనివెల్ల పాలని నమ్మెదవు, నీ భార్య పరమ భక్తురాలని, పతిసేవ పరురాలని, గుణవతియని నమ్మియున్నావు. నీ సేవ చేయుటకు మన సొప్పక, అడవుల జేరినది. అచ్చట రుద్రాక్ష పిల్లివలె దొంగజపములు చేయుచు భోగలాలసయై, మిండగాం డ్రతో స్వర్గసుఖ మునుభవించుచున్నదట! ఇదియంతయు కనులారా చూచి వచ్చినవారు చెప్పగా విన్నాను' అనునంతలో బరమన్న ఉగ్రుడై తల్లిని జూచి, 'చాలు చాలు నీ మాటలు నీ కెవరో కానివారు చెప్పినమాటలు నమ్మి

నామల్లిపై కారాలు మిరియాలు నూరుచున్నావు. నా మల్లి బంగారు. ఏమి దాని శివపూజ? పతిభక్తి! అతిథి సేవ! దాన్ని చూచి నీ నాగమ్మ నేర్చుకొనవలెను. దాని సత్ప్రవర్తనచూచి ఓర్వలేక, నీవును నీనాగమ్మయు నామల్లిని అడవుల కంపితిరి. ఆలుమగలును ఎడబాపితిరి. పాపము! దానికచ్చట కడుపార కూడు లేదు. నీవుపంపిన అంబలితో ప్రాణములు బిగబట్టుకొనియున్నది. మీ కింకను కసిదీఱలేదా,' అని తీక్ష్ణముగ జలికెను.

కొడుకు మాటలువిని, పద్మమ్మ కథ అడ్డముతిరిగె నని భావించి, బరమన్నను శాంతింప జేయ నాగమ్మను బంపి, లేడివేడి పాయసము తెప్పించి యిచ్చెను. దాని నాతడు కడుపార త్రావి, 'అమ్మా! నీ వెంతటి దయా మయివి? ఆకలెరిగి, పాయసమిచ్చి తృప్తి పరచితివి. నీ మాటలు విందును. నన్నిప్పుడేమి చేయమందువు చెప్పు' మనెను.

అప్పుడు పద్మమ్మ కొడుకు దారికి వచ్చెనని సంత సించి, 'బరమన్నా! నేనిచ్చు కత్తి గొంపోయి, మల్లమ్మ చేష్టలు నీవు స్వయముగా జూచి, నమ్మిక కలుగుచో దాని శిరము ఖండించి రమ్మ'ని చెప్పెను.

తోడనే బరమన్న నాగమ్మ తెచ్చియిచ్చినవాడి కత్తిని చేబూని, యడవికేగి, మల్లమ్మ గుడిసె దాపుననున్న చెట్టుచాటున దాగియుండెను.

అంతలో జంగమయ్య అటకు వచ్చెను. శివపూజలో మగ్నమైయున్న మల్లమ్మ యతనిజూచి, లేచివచ్చి నమస్కరించి, 'స్వామీ! నేడేల ఆలసించితిరి? మీ కొఱకు వేచియున్నాను. దైవస్వరూపులగు మీ సేవ కంటె నాకు గావలసినదేమి? నా దౌర్భాగ్యవశమున నా పతిదేవుని సేవించు భాగ్యము నాకు లేకపోయినమీ సేవ యబ్బుటవలన ధన్యనైతిని'.

అని వినయమున బలుకుచు దొప్పనిండుగ అంబలి పోసియిచ్చెను.

ఆ కుహనా వేషధారి అంబలిని గడుపార ద్రావి, 'తల్లీ! నీవెంత దయగలదానవమ్మా? ఆకలెరిగి, తల్లివలె ఆహారము పెట్టి పోషించుచున్నావు. నీజన్మ సార్థకమైనది! నీవంటి సద్గుణవతిని గన్న తల్లిదండ్రులు ధన్యులు. నిన్ను చేపట్టిన పతి పుణ్యవంతుడు. నీవు స్త్రీలోకమునకు మేలుబంతివి'.

అనుచుండ చెట్టుచాటున దాగియున్న బరమన్న వారి సంభాషణవిని ఆదేమి యాశ్చర్యము! నామల్లి

జంగమయ్యను 'స్వామీ' యని సంబోధించినది. జంగ మయ్య 'మల్లిని తల్లీ!' యనెను. మా అమ్మవలన విన్న దానికిని ప్రత్యక్షముగ కన్నదానికిని సంబంధము లేదు. ఆ జంగమయ్య సాక్షాచ్ఛంకరుడుగాని వేఱొకడు గాడు. నామల్లి పరమ పతివ్రత మా అమ్మ యిట్టి సచ్ఛీలవతిని కడతేర్ప బోధించే పంపెను. ఇది యంతయు చూపోక, నాగమ్మ పన్నిన పన్నుగడ' అనుకొనునంతలో నా పరమేశ్వరుడు మల్లమ్మను గాంచి, అమ్మా! నీపతి నీశీల మును శంకించి, నినుజంప కఱకు కత్తిని చేబూని వచ్చి చెట్టు చాటున దాగియున్నాడు. ఆకత్తి యేమైనదో చూడు' మని వెడలిపోయెను.

ఆమాటవిని. బరమన్న కత్తినిజూడ నది అపరం జియై వెలుగొందుచుండెను.

అప్పుడాతడు మల్లమ్మ దైవాంశ సంభూతయనియు ఆ యతిథి శ్రీశైల మల్లేశుడనియు నిశ్చయించి, పరుగిడు పోయి, మల్లమ్మ పాదములపై బడ నుంకించెను.

అదిజూచి, మల్లమ్మ భీతిల్లి, 'పతిదేవా? ఇదేమి? మీరు నాకు దైవసములరు. నేను మీ యర్ధాంగిని. మీరు నా పాదములంటవచ్చునా? అది మహాపరాధము.

ఇన్నాళ్ళు మీ పాదసేవలేక పరితపించితిని. శ్రీ మల్లికార్జునుని కృపవలన నేడది లభ్యమైనది. ఎంతటి అదృష్టవంతురాలను! సతికి పతి సేవయే మహాభాగ్య" మని భర్తృపాదములకు నమస్కరించెను.

అంత బరమన్న సంతోష బాష్పములు రాల్చుచు భార్యనుగాంచి, "నీ వెంత ధన్యురాలవు! పరమశివుడు నీకు సాక్షాత్కరించి, అనుదినము నీచేతి యంబలి త్రాగుచున్నాడు. ఆ మహాదేవుని దర్శనభాగ్యము నాకును అబ్బజేయు"మని మనసార గోరెను.

అప్పుడా యిల్లాలు తన పెనిమిటికోర్కె దీర్పనెంచి తన ప్రాతివ్రత్య మహిమచే మల్లికార్జునుని ప్రార్థించి సాక్షాత్కరింప చేసెను.

మల్లయ్య ఆ దంపతులనుగాంచి, భక్తులారా! మీ కీర్తి దిగంతములకు ప్రాకుగాక! మీరీ లోకమున చేయవలసిన పనులుచేసి, తుదకు నా సాన్నిధ్యమునుజేరి, అక్షయ సుఖ మనుభవింతు''రని దీవించి. యదృశ్యుడయ్యెను.

బరమన్న మల్లమ్మ ప్రాతివ్రత్యమహిమను మెచ్చుకొనుచు నింటికి మరలిపోయెను.

౧౧

అంతలో రెండు నెలలక్రిందట గ్రామాంతరమునకు పనిగలిగి పోయియుండిన హేమారెడ్డి తిరిగివచ్చి, గృహ పరిస్థితులను జూచి విచారపడెను.

పెద్దకొడుకు ఇంటనున్న బంగారునగలను దోచుకొనిపోయి సానులయిండ్లు చేర్చెను. పంటలు సున్నయయ్యెను. గడ్డివాములు తగులబడెను. ఉన్న రెండు నట్టులు నిట్టనిలువునబడి చనిపోయెను. జీతగాండ్రు నిలిచిపోయిరి. అప్పులిచ్చినవారు పీక జొచ్చిరి. తినుట కింట ధాన్యము లేదు. బంగారువంటి సంసారము పాడయ్యెను.

ఈ విషమ పరిస్థితులకు కారణమేమన హేమారెడ్డి యోజించి యోజించి, చివర కిదియంతయు భక్తురాలగు మల్లమ్మను అన్యాయముగ నడవులకంపిన పాపఫలము, కాదేని నా చిన్నకోడలు మల్లమ్మ యింట నడుగుపెట్టగనే పాలపొంగువలె నుబికి వచ్చిన సంసారమిప్పుడేల మంటిపాలగును? ఆమె మాయింటి భాగ్యదేవత. పరమ భక్తురాలు. అట్టి తల్లిని అనరాని మాటలని యిల్లు వెడలుగొట్టిన, మల్లికార్జును డూరకుండునా పాపఫలము కట్టికడుపెను. ఇదియంతయు నా భార్యయు పెద్దకోడలు నాగమ్మయు తెచ్చిన చేటని నిశ్చయించి

భార్యను చుఱచుఱ చూచుచు "ఓసీ! పాపిష్ఠురాలా! అన్నము పున్న మెఱుగని తల్లిని మల్లమ్మను అడవుల పాలుచేసి కొంప కెంత చేటు తెచ్చితివి? నీ పెద్దకోడలి మాట నీకు వేదవాక్యము. అది నీకు కోడలై, మల్లమ్మ కాకపోయినా? దాని మాటవిని, పండువంటి సంసారము పాడుచేసితివి. ఇక నేనీ యింట క్షణమైన నుండజాలను. మల్లమ్మ కడకుబోయెదను. నీవును, నీ పెద్దకోడలును ఈ యింట నుట్టిగట్టుకొని, ఊగులాడుడు. ఛీ! మీ మొగ ములు చూడరా"దని నిష్ఠురము లాడెను.

అప్పుడు ఒరమన్న తండ్రితో "నాయనా! నీవన్నది నిజము. ఈ పాపిష్ఠుల మొగములు చూడరాదు నామల్లి పరమభక్తురాలు. పతివ్రత. మల్లికార్జును నే జంగమరూప మునవచ్చి, మల్లి చేతి అంబలినిత్రాగి పోవుచున్నాడు. ఇది నాకన్నులార చూచి వచ్చితిని" అని చెప్పెను.

అప్పుడు పద్మమ్మ భర్తతో, ఇక మీరును, మీ చిన్న కొడుకును భక్తురాలగు మల్లమ్మయు నీ యింట సుఖముగా నుండుడు. దుర్మార్గులమగు నేనును, నాగ మ్మయు పుట్టినింటికి పోయెదము"అని నిక్కచ్చిగాబలికి నాగమ్మను వెంటబెట్టుకొని పోయెను.

అంత హేమారెడ్డి పీడవదలినదని యెంచి, బరమా రెడ్డిని యింటనుంచి తాను మల్లమ్మను తోడి తేర నడవి కేగెను.

ఆ సమయమున మల్లమ్మ శివపూజ చేయుచుండెను.

అటువచ్చిన మామను జూచి. మల్లమ్మ పరమ సంతోషమున లేచివచ్చి, చాపనైచి కూర్చుండబెట్టి, తీర్థ ప్రసాదములిచ్చి, యోగక్షేమము లరయుచుండెను.

అప్పుడు హేమారెడ్డి తన యింట పరిస్థితులను కోడలికి జెప్పి, కన్నీరు గార్చెను.

అదిచూచి, మల్లమ్మ విచారపడి, మామతో, "మీరు దుఃఖింపవలదు. కాలమొకరీతిగా నుండదు. ఏ కాలమున కేది జరుగునో ఎవరి కెఱుక? అంతయు భగవ దిచ్ఛ. కష్టసుఖములు కావడికుండలు. సుఖము కలిగిన తఱి విఱ్ఱవీగుటయు – కష్టము వచ్చిన తఱి పరితపించు టయు అజ్ఞుల లక్షణము. విజ్ఞులగు మీ రిట్లు దుఃఖపడ వలదు. మల్లికార్జునుని కృపవలన అనతి కాలమున మనకు సర్వము శుభమగును. అదిగో! ఆ కనబడు కుప్పకడ కేగి నేనిచ్చు శివుని పాదోదకము దానిపై జల్లుడు" అని చెప్పిన, తోడనే, హేమారెడ్డి యటకుబోయి, యాకుప్ప

పై నాజలము ప్రోక్షించెను. వెంటనే యా గోమయము కుప్ప హేమరాశి యయ్యెను. అదిగాంచి హేమారెడ్డి వింతనొంది మల్లమ్మతో, "ఇదేమితల్లీ ! పేడకుప్ప - బంగారుకుప్పయైన" దనెను. "ఇందేమియు వింతలేదు. ఇది యంతయు మల్లికార్జునుని కృప. ఆ పరమేశ్వరుని కరుణ కలుగుచో, కానిదేది కలదు?" అని పలికి, దీనిని గొంపోయి, మీ అప్పు సప్పులు దీర్చుకొని, సుఖముండు" డనెను.

అంత హేమారెడ్డి మల్లమ్మ భక్తికి మెచ్చుకొని. "తల్లీ ! నీవు నావెంట నింటికి రావలయు" నని బతిమాలెను.

అప్పుడామె, నేను వచ్చుట కింకను కొంతకాలము పట్టును. మీరు పొం"డని వినయమున బలికెను,

ఆ మాటకు హేమారెడ్డి బదులాడక, మల్లమ్మతో "పోయివచ్చెద"నని చెప్పి, యా బంగారు ముద్దుగొని యింటికేగెను.

పద్మమ్మయు, నాగమ్మయు పుట్టింటిని చేరగనే, వారికి తీఱని వ్యాధులు సక్రమించి బాధపడ జొచ్చిరి. పద్మమ్మకు ఉబ్బసము - నాగమ్మకు కడుపునొప్పి.

ఒకనాడు నాగమ్మ పద్మమ్మతో "అత్తా! నిన్న సిద్ధాపురమునుండి మన పొసగింటి బసవమ్మ వచ్చి నన్ను జూచి. "నాగమ్మా! ఇప్పుడు మీ సంసార మెట్లున్నదో వింటివా: మూడు పువ్వులు-ఆరు కాయలతో ప్రాణించు చున్నది. మల్లమ్మ మీ మామకు పెద్ద బంగారుముద్ద యిచ్చినది. దానితో ఆయన జోడెద్దులను గొని, వ్యవసాయము గొప్పగా సాగించి, బాగుగా పండించి గాదెలు నింపినాడు. అప్పుసప్పులు దీర్చినాడు" అని చెప్పెనని నుడివెను.

ఆమాటలు విని, పద్మమ్మ "బంగార మిచ్చుటకు దాని కెక్కడిదే?" అని ప్రశ్నించెను. "ఏమోనమ్మ! ఇప్పటికి మల్లమ్మ ముందటి మల్లమ్మగాదుగదా! దాని యదృష్టమేమోగాని, పట్టినదెల్ల బంగారమేనట! మంత్రోదకమిచ్చి వ్యాధులను మాన్పుట!" "అట్లయిన నాగూ! మనకిచ్చట ఈ వ్యాధులు కుదురవు. మనము మల్లమ్మ కడకు పోద"మని చెప్పి, తోడనే నాగమ్మ వెంటబెట్టుకొని పయన మాయెను.

వారిద్దరును మల్లమ్మకడకు బోవునప్పటికి సిద్ధాపురమునుండి హేమారెడ్డి వచ్చి, మల్లమ్మతో. "తల్లీ! నీదయవలన సంసారమిప్పుడు కుదురుకొన్నది. నన్నిక

'ఇచ్చి పొమ్మను వారు లేరు. పంటలు బాగుగాపండి. ఇలుద్రొక్కుకొని వచ్చిన వారికెంత పెట్టగలుగునా" ననుచుండ వారిద్దరును మల్లమ్మను డాసి, గట్టిగ కౌగలించుకొని, తల్లీ ! మా తప్పులను క్షమించి, మమ్మ గాపాడుము. అజ్ఞానవశమున నీ మహిమ తెలియక, ని న్ననరాని మాటలని కష్టపెట్టితిమి. ఆ ఫలమిప్పుడు వ్యాధి రూపమున ననుభవించుచున్నాము. బుద్ధి వచ్చినది మా వ్యాధులను మాన్పి పున్నెము గట్టుకొమ్మని కన్నీరు గార్చుడు ప్రార్థింప జొచ్చిరి.

అప్పుడు హేమారెడ్డి వారిని జూచి, చీ ! పొండు మీరు మా పాలిటికి మారెమ్మ మారేడమ్మలు తగదు. మని యిచ్చుటికిని దాపరించితిరా?" అని గద్దించెను.

అంత మల్లమ్మ మామను ఓదార్చి, అత్తను, అక్కను శివపాదోదక మీయ వారి వ్యాధులు క్షణమా త్రమున మాయమయ్యెను.

అంతలో బరమన్నయు నచ్చుటికి వచ్చెను.

మల్లమ్మ భర్తను చూచినతోడనే భక్తితో నమస్కరించి. ఎల్లరను గూర్చుండజెట్టి, పద్మమ్మనుగాంచి "అత్తా! మీరెంతటి దయామయులరు! మీ దయవలన నాకిచ్చుట మల్లయ్య సేవయు, గోసేవయు నింతకాలము

అవిచ్ఛిన్నముగ కొనసాగినవి. నేనందులకు కృతజ్ఞురాలను ప్రతి జీవియు సాత్త్విక భావము - సద్భక్తి - సౌశీల్య వర్తనము - సార్థ్రహృదయము-ఈర్ష్యాహంకార రహిత చిత్తము గలిగి వర్తించిన తప్పక ముక్తి సౌధముచేరును. మనకందఱికి శ్రీశైల మల్లికార్జునుడె దిక్కు. ఆ మహానీయుని సేవించి, తరింత''మని పలుకుచు నిమీలిత లోచనయై మల్లికార్జునుని మనమున ధ్యానించెను.

అప్పుడా మహాదేవుడు ప్రత్యక్షమై మల్లమ్మను గాంచి, తల్లీ! నీభక్తి అనన్య సామాన్యమైనది. నీ పుట్టుకవలన నీ వంశమునకు కీర్తి వచ్చెను. నీ సంసర్గ కలిమిచే దుర్జనులు సహితము సజ్జనులగుదురు. నీ వింకను కొంతకాల మీ లోకమున నుండి, ప్రాకృతులకు భక్తి మార్గమును దెలిపి, ఆ మీఁద నీవు నీవారితో కైలాసము చేరుదు'' వని చెప్పి, దీవించి, యదృశ్యు డయ్యెను.

భక్త మల్లమ్మ యట్టులే శివతత్త్వమును జగతికి బోధించుచు జీవిత విశేషమును గడపి, తనవారితో శివ సాయుజ్య మొందెను.

మల్లమ్మా!నినుగన్న భరతమాత ఎంతధన్యాత్మురాలు!

సర్వేజనా సుఖినోభవంతు.

---

జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, అరండల్ పేట, గుంటూరు-2.